శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

| | | |
|---|---|---|
| సంపుటము. ౩౪ | పార్థివ<br>శ్రావణ-ఫాల్గునములు | సంచిక ౩-౬ |


## శ్రీనాథుఁడు—బంగారు మొలక.

కుందూరి ఈశ్వరదత్తు, బి. ఏ.

శ్రీనాథుఁడు హరవిలాస పీఠికలో నవచి తిప్పయ్య సోదరుని ద్వీపాంతర వాణిజ్య వర్ణనా సందర్భమున, జలనోంగినుండి యాతఁడు బంగారు మొలకను దెచ్చినట్లు వర్ణించెను.

సీ. పంజారఁ గప్పురపాదపంబులఁ దెచ్చె
జలనోంగి బంగారు మొలక దెచ్చె

ఈబంగారు మొలక కర్థము శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తాము నూతనముగా సంస్కరించి ప్రకటించిన హరవిలాసపీఠికలో గులాబిచెట్టన పన్నీరు మొలక యని సెలవిచ్చినారు. కాని వీరిచ్చిన యర్థము సరికాదని తలఁచుట కాధారములు గలవు. బంగారు మొలకను గూర్చి ప్రశంసించిన మఱియొక సుప్రసిద్ధాంధ్రకవి గలఁడు. చెళ్లపిళ్ల సరసకవి యామినీపూర్ణతిలకావిలాసములో యామినీపూర్ణతిలక సౌందర్యమును వర్ణించుసందర్భమున నామెను బంగారు మొలకతోఁ బోల్చినాఁడు. ఆపద్యము నిందుదాహరించెదను.

ఉ. కంటని మాటుపండు కసుగందని జాబిలినిగ్గు తేటిమూ
గ్గొందనిపూలగుత్తి మరుగందని కల్పకమొలంగుజిల్గు వా
గందని ముద్దుచిల్క తలఁ గందని బంగరుమొగ్గపూబడా
గందని మారువాటి వరగందని క్రొన్నెలబింకపూవ నూ
గందని తమ్మిమొగ్గ పులుగందని ముత్తెము సుమ్ము కొమ్మనున్

సీ. కళలు దేరదు నిండు జిలుగువన్నెలగుత్తి
గమగమవలచు బంగారుమొలక
కొదమతుమ్మెద వాదుకొనని క్రొన్ననదండ
నడువనేర్చిన రతనంపుబొమ్మ
కలలకనిచ్చు తొల్కరిమింటఁదీఁగ దె
మ్మెర చూరగొనని కప్పురపుఁదావి
తొడరి కోయిల సుంక మడుగని మెలమావి
వెలలేని జిలుగువన్నెలకోటారు

గీ. కాంత రతికాంతు కాంతుఁ బూజింతు ననుచు
సంతసము సంత సంతసల్ దొంతరిలఁగ
సంతరించిన వింతచామంతిబంతి
వంతుకెక్కిన వలరాజుదంతి యింతి.

ద్వితీయాశ్వాసము, 70-71 ప.

పై పద్యములలోఁ గవి యుక్తవయస్సులోనున్న యామినీపూర్ణతిలకను వర్ణించు రూపకాతిశయోక్త్యలంకారమును నిరూపించెను. గమగమవలచు బంగారుమొలక యనఁగాఁ దావి యబ్బిన బంగార మని యర్థము.

ఈ బంగారుమొలక కర్థము బ్రౌణ్యనిఘంటువునఁ గలదు.

మొలక : ఈ పడుచు బంగారుమొలకవలె నున్నది. (She is a perfect beauty)

బ్రౌణ్యనిఘంటువు, పుట 818. 1852 ముద్రణము.

ఈ బంగారుమొలకకు ఆంగ్లమున నగ్గెట్ (Nugget) అని యర్థము. పూర్వకాలమున దక్షిణాపథమునుండి సార్థవాహులు సువర్ణ ద్వీపము (Java) నుండి, యీ బంగారుమొలకలను దెచ్చుచుండెడివారట. జలనోంగి యనునది ఇప్పుడు, జావా, సుమత్రా, బోర్నియో ద్వీపములలో నొక రేవుపట్టణమై యుండనోపు. పూర్వము బర్మాలోని కొంతభాగమునకు రామన్నదేశ మనియు, సువర్ణభూమి యనియుఁ బేర్లుండెను *

శ్రీనాథుఁడు తిప్పయ తరుణా, చీని, తవాయి, గోవ, రమణా స్థానంబులనుండి సామాన్లఁ దెప్పించుచుండెనని చెప్పినాఁడు. కాఁబట్టి శ్రీనాథుఁడు వర్ణించిన బంగారుమొలక కర్థము గులాబీ దట్టని కాదని స్పష్టముగాఁ జెప్పవచ్చును. గొజ్జఁగినీ రనఁగాఁ బన్నీరు. గులాబీనీ రని యభిప్రాయపడి, సీసపద్యము మొదటిపాదములో కవి కర్పూరపాదపములను దెచ్చినట్లు చెప్పుటచే బంగారుమొలక యనఁగాఁ బన్నీరుమొలకయై యుండునని ప్రభాకరశాస్త్రిగారు తలంచిరి. గొజ్జంగి పదమునకుఁ బూర్వనిఘంటువులలో గులాబీ యని యర్థము లేదు. కిట్టెలుదొర కన్నడనిఘంటువులలో గొజ్జఁగి పదమున కొకవిధమైన మల్లె లేక చామంతి యని యర్థము వ్రాసియున్నాఁడు. అట్లే మద్రాసు విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన తమిళనిఘంటువునందుఁ గలదు.

గుజ్జెగ : గజ్జిగె; గుజ్జుగె; గొజ్జగె A kind of Jasmine
సేవన్తిగె, తెలుగు, గుజరి, తమిళము కొలంగిరి.

Kittel Dicionery.

ఈ విషయము పరిశోధింపఁదగినది. మఱియొక వ్యాసమున నీ ప్రసంగమును జేసెదను.

---

Now, we have definite evidence that a portion of Burma was known in latter ages as Suvarnabhumi. According to Kalyani inscriptions(1476 A.D), Ramannadesa was also called Suvarnabhumi.

అవని తిప్పయ 'చీని, సింహళ, తవాయి, హురుమంజి, జోణంగి ప్రభృతి నానాద్వీపనగరాకరములకు ధనకనకవస్తువాహనమాణిక్య గాణిక్యములను దెప్పించి యిప్పించువాఁడఁట. ఈజోణఁగిదేశ మిప్పటి తురుష్క (Turkey) పారసీక (Persia) దేశ భూభాగము. ఆనాఁటి వణిజులు పూర్వపశ్చిమదేశములలో వాణిజ్యము సాగించు చుండినటుల శ్రీనాథుఁడు స్పష్టపఱచినాఁడు కిట్టెల్ నిఘంటువులో జోణంగి పదమున కర్థ మిట్లు గలదు.

జోనంగ—Tbh of యవనక, An Ionian, a sunk, An Arab (తురక, తురుష్కయవన Mr. 382. తెలుగు జోణంగి తమిళ మలయాళము. జోనగ, జోనకవఱ—A Turkish Arab)

జోణంగిదేశ మనఁగా నిప్పటి యరేబియా, టర్కీప్రాంతభూమి యని విశదము కాఁగలదు. ప్రభాకరశాస్త్రిగా రభిప్రాయపడినట్లు మలబారుప్రాంతవిషయము కాదనవచ్చును.

---

శ్రీః

# కుమారసంభవ విమర్శనము.

విద్వాన్ శ్రీ భక్తవత్సలము, బి. ఏ

---

## I

కుమారసంభవ మనుపేర నిప్పుడు మనకు లభ్యమై యుండు నది పదునేడు సర్గల గ్రంథము. తారకాసుర సంహారమువఱకు నందు కథ గలదు. ఇవే కాకయుఁ దొరకని దానిసర్గ లిరువదిరెండనియు, నేఁటి కాలమున కడపటి నైదుసర్గలును నష్టములైపోఁగా మిగిలినవీ పదునేడు సర్గలనియుఁ జెప్పుచున్నారు. ఇందుఁ గూర్చి కొందఱు పాశ్చాత్యుల యభిప్రాయ మేమనఁగా పార్వతీపరమేశ్వరుల పెండ్లివఱకు నుండు నెనిమిదిసర్గల గ్రంథభాగమే కాళిదాసు వ్రాసినట్టి దనియు, తరువాతి సర్గ లెవరో వ్రాసి కాళిదాసు గ్రంథమునకుఁ జేర్పఁగా నవి యతనిపేర వ్యాప్తికి వచ్చిన వనియు

పెండ్లితోనే కథ ముగియు నేని యప్పుడు గ్రంథమునకుం బార్వతీపరిణయ మనియో గిరిజాకల్యాణ మనియో పేరు పెట్టవలయునే కాని కుమారసంభవ మను నామ మెట్లు సరిపడును? కాళిదాసు తగినపేరు పెట్టనేరనివాఁడా? మహాకవి యగు నతని రచనలలోఁ బ్రత్యక్షరమును భావగర్భమును నర్థపూర్ణమునై యుండునే కాని వ్యర్థమై యుండదే? ఇఁకను గ్రంథమున కతఁడు పెట్టినపేరే తగక యుండునా? ప్రమాణబుద్ధితో మహాకవిహృదయము నారయుదు మేని ఆతఁ డుంచిన కుమారసంభవ మను పేరే గ్రంథమునకుఁ దగిన దనియు, మఱి యెవరుపెట్టు నేపేరును అంత యనురూపము గా దనియుఁ దెలిసికొనఁగలవార మగుదుము. మహాకవి యగు నతని రచనయందుఁ గాని రొక్కపదమునందొ లగించితిమేని యందులకు సమాధానమును మనము

కూర్పఁజాలియుండ మాఁగా, నిఁక మహాకవికులగురు వగు కాళిదాసు వాడిన మాటను దొలఁగఁజేసి పదాంతరమును కాదుగదా, మన స్స్వైనాంతరము నైన యూహించి పట్టి కూర్పఁగలవాఁ డెం దుండును?

రాక్షసబాధితు లగు దేవతలు కోరు ప్రయోజనము కుమార స్వామి పుట్టుట అదే కుమారసంభవము (II 51-2) ఆ ప్రయోజనము సిద్ధించుట కుపాయము ఉమామహేశ్వరుల వివాహము ఘటిల్లఁజేయు టయే యని బ్రహ్మ యుపదేశించెను. (II 57-61) మన్మథుని బూది (III) దేవతలు కాంక్షించిన యుక్తము కానసాగక పోయినను వివాహ మెట్లో పార్వతీతపఃఫలముగా జరిగియే తీరును. (V, VI, VII). కుమారసంభవమునకు అద్వితీయోపాయముగా నుపదేశింపఁబడిన వివాహము నెఱవేఱుటయే కథకు ముగింపుగ. ఉపాయ మట్లో ఘటమైనందునం దన్నిర్వర్తనము చేతనే వ్యంజితమైన ఫలసిద్ధిని మరల వాచ్యముగఁ 'గుమారుఁడు గల్గె' నని చెప్పుట చప్పనగా నుండును. కావుననే వ్యంగ్యకవనమునకుం బేరెన్నికఁగన్న కాళిదాసమహాకవి యట్లు చెప్పఁడాయెను. 'కుమారసంభవము'నకు 'గిరిజాకల్యాణ'మను పేర నొసరిన యాంధ్రగద్యానువాదగ్రంథమునకుఁ బీఠిక వ్రాయుచు శ్రీయుతులు ఒంగోలు వేంకటరంగయ్య B. A., B. L. గారిట్లు వ్రాయుచున్నారు:

The theme of this composition as conceived by the great master-poet starts from a combined request of all the Devas addressed to Brahma, the Creator, for a leader and commander of the angelic forces to war against and destroy the Titan Tarakasura and his hosts. The artistic consummation of the concep'ion of such a plot may well be achieved and perfected by the wedding of the Divine Pair, the world-parents, Parvati and Parameswara and need not go down to the narration of the physical embodiment of the Devine Spirit into a son." సిద్ధించిన దని చెప్పుటతో నక్కఱలేకయే సిద్ధించిన ప్రయోజనము కుమారసంభవము ప్రధానముండఁగా తత్సాధకోపాయమగు పరిణయమునకుఁ బ్రాధాన్యము లేదు. ప్రధాన మేదో దానినే కాళిదాసు గ్రంథమునకు పేరుచేసెను. పూర్వోక్తానువాదగ్రంథమునఁ గడపటి

వాక్య మిది. "కొంతకాలమునకు గౌరీశంకరులకుఁ గుమారుఁడు జన్మించి తారకుని వధించి విశ్వకళ్యాణసంధాయి యయ్యె" కుమారసంభవము నిట్లు వాచ్యముగఁ జెప్పియు ననువాదకులు ఆపేరు నేల తొలంగించిరో! మఱుఁగు అనుయోగ్యంబునకే కాని ప్రోత్తండనమునకుఁ గాదుగదా!

II

రక్షకునికొఱకైన లోకుల తహతహ నియాధమగుటకు సాధనముగాఁ గాళిదాసు తారకాసురుని దురధికారప్రాభవమును వర్ణించిన తెలుఁగు వర్ణనీయము. (a) అతఁడు ఋతులపొత్తు నపహరించెను. మేరుశృంగముల వాత్మాలయములఁ క్రీడాశైలములుగా సంతరించుకొనెను. మిన్నేటిపసిఁడితామరల నూడఁబెఱికి తనదిగ్గియలలోఁ బాదుకొల్పుకొనెను. విమానమార్గముల నొరులం దలచూపనీయక వానిని తనసంచారమునకే యుంచుకొనెను. దేవతల హవిర్భాగముల నడిసి తీసికొనెను. ఇంద్రుని యుచ్చైశ్శ్రవమును హరించెను. రత్నాకరముల రత్నముల నన్నిటిని నాఁచికొనెను. పుష్కలావర్తకాది మేఘములం దన దంతావళములు వప్రక్రీడకు లోఁబఱచెను. (b) తనకు లేని కల్పవృక్షముల దేవతల కేలయని వానిని తెగనఱికించెను. (c) లోకక్షేమమునకై పాటుపడు సూర్యచంద్రవాయ్వాదులం దనసేవకే కట్టుపఱచెను. తన కొలఁకుల కమలములను విరియించుటయే సూర్యునకును, తననిశాలికారములకు వెన్నెలం గూర్చుటయే చంద్రునకును, తనకు పువ్వులం జేర్చిపెట్టుటయే ఋతువులకును, తనకుఁ జామరములు పూనుటయే అచ్చరలకును వారి శిరోరత్నముల వెలుఁగునం దననగరము ప్రకాశింపఁజేయుటయే వాసుకి ప్రముఖసర్పరాజులకును- పనులుగాఁ గల్పించెను. (d) లోకములం దాటుపోటు గావించెను. సూర్యున కొండకాలమున సైతము వేఁడిమి లేకుండునట్లును, వెన్నెలకు పెరుగుట, తరుగుటలు లేకుండునట్లును, వాయువునకు విశృంఖలసంచారము లుడుగునట్లును, ఋతువులకుం గ్రమప్రాప్తియు నెంత లేక ఫలి యున్నను ధర్మములు దప్పునట్లును

చేసెను. తారకాసురుని దురధికారంపుం బ్రాభవము సహింప నెవరికిని సాధ్యపడదయ్యెను. కానుకలు పెట్టి సుముఖుం జేసికొందమా యన్న, దుర్జనుం డగుటచే వశుఁడు ప్రత్యపకారముచే నణఁగునే కాని ఉపకారములకు లొంగఁడు పోరి జయింతమా యన్న విష్ణువునంతటి దేవునకుం గూడ నది యసాధ్యమాయెను. కావుననే కుమారస్వామి యవతరింప వలసివచ్చెను. అదే ఏతత్ కావ్యప్రతిపాద్యప్రయోజనము.

తారకాసురసంహారసమర్థుఁడగు సంతతి నొకనిఁ బ్రసాదింపు మని దేవతలు బ్రహ్మదేవుం బ్రార్థింప నావేల్పు పెద్ద యుమాశంకరుల కుమారుఁడే యట్టిఁ డగునని యుమ, నుమాసౌందర్య మీశుని చిత్తము నాకర్షించునట్లు చేయుటయే వారి వివాహమును ఘటిల్లఁజేయు నుపాయ మనియు నుపదేశించెను. ఆయుపాయము సాపాయ మగుటకు హేతువైన యందలి లోప మేమనఁగా, ఈశుం డాశ్రితం గూర్చిన విస్మృతి. ఇది బ్రహ్మదేవునకే క్రమ్మనవ నింక దేవత లితరు లందురు లోనగుటలో వింతలేదు. దేవతలు మన్మథుం బూన్చిరి. మన్మథోద్యోగము

(సశేషము)

# దర్శనసమీక్ష.

సాహిత్యశిరోమణి, భాషాప్రవీణ.
చిలుకూరి వీరభద్రశాస్త్రి

(అనువృత్తము.)

## నకులీశపాశుపతదర్శనము.

ఈ దర్శనమున నీశ్వరునిచే జీవులసంసారమును దొలంగించుటకయి కార్య, కారణ, యోగ, విధి, దుఃఖాంతము లనియెడు నైదుతత్త్వములు ప్రతిపాదింపఁబడినవి. పశు, పశుపతిశబ్దములు లోకప్రసిద్ధరీతి నభియుక్తులచే నిర్వచింపఁబడినవి.

శ్లో. బ్రహ్మాద్యాస్స్తంబపర్యంతాః పశవః పరికీర్తితాః.
తేషాంహి నాయకో యస్మాచ్ఛివః పశుపతిః స్మృతః.

పశువులు జీవులు, పశుపతి యీశ్వరుఁడు. చేతనాచేతనాత్మకమగు ప్రపంచమునఁ గల పదార్థజాతమంతయు కార్యము. ఈశ్వరుఁడు కారణము. ఇతఁడు స్వతంత్రుఁడు. జపము, ధ్యానము, మున్నగునవి యోగము. మూఁడుకాలములయందు స్నానము, భస్మస్నానము మొదలగునది వ్రతము. పాశముల వీడి యీశ్వరుఁ డగుటయే దుఃఖాంతము వీరిమతమున మోక్ష మీదుఃఖాంతమే. ఈ పంచతత్త్వాత్మక మగు పాశుపతతంత్రమువలననే ముక్తి కలుగు నని వీరినమ్మకి. కావుననే—

శ్లో. జ్ఞానమాత్రే వృథాశాస్త్రం సాధూ ద్వృష్టిస్తు దుర్లభా,
పంచార్థా దన్యతో నాస్తి యథావ త్తత్త్వనిశ్చయః.

అని యభియుక్తవాక్యము.

---

## శైవదర్శనము.

కర్మాదినిరపేక్షుఁ డీశ్వరుఁడు కారణ మనుచో వైషమ్యము నైర్ఘృణ్యము ననెడి దోషము లీశ్వరునకుఁ దటస్థించును. అని యాయా

మువారు ఈశ్వరుఁడు కర్మసాపేక్షుఁడయి కారణ మగు నని యంగీకరించుటయేకాక తత్త్వములనొండురీతిగా నంగీకరించిరి ౧ పతి. ౨ విద్య. ౩ అవిద్య. ౪ పశువు. ౫ పాశము. ౬ కారణము వానిలో పతి శివుఁడు. తత్త్వజ్ఞానము విద్య. విద్యాజ్ఞానము అవిద్య అశుచిత్వము మలము. మాయారోధము, కర్మశక్తి, యను భేదములతోఁ గూడినది పాశము. (జీవబంధము.) జీవుఁడు పశువు. పాశనివృత్తికయి జపధ్యానాచరణము కారణము.

శ్లో. పతివిద్యే తథాఽవిద్యా పశుః పాశశ్చ కారణం,
తన్నివృత్తావితి ప్రోక్తాః పదార్థాః షట్ సమాసతః.

ఈతత్త్వములను యోగ్యముగాఁ దెలియుటవలనఁ బాశవిమోచన మగును. దానిచే నీశ్వరత్వము పొందుట రూపమయిన మోక్షము లభించు నని యీదర్శనకారులసిద్ధాంతసంక్షేపము.

---

## ప్రత్యభిజ్ఞాదర్శనము.

ఈ మతావలంబులు మాహేశ్వరులు. వీరు మోక్షప్రాప్తికై ప్రత్యభిజ్ఞయే (అతఁడే నేను, వాఁడే వీఁడు, అదే యిది యని తెలియుట) ప్రధాన మగు సాధన మని యందురు. ఈశ్వరుఁడు పూర్ణుఁడు, స్వతంత్రుఁడు. కావున జగత్తును నిర్మించుటకయి కర్మాదిసాధనమును దేని నపేక్షింపఁడు. తన యిచ్ఛచేతనే యంతయు నిర్మించును.

చైతన్యము జీవేశ్వరులకు సహజము. కావున జీవులు పరస్పరము భిన్ను లయినను నీశ్వరునికంటె భిన్నులు కానేరరు. పరమేశ్వరునిలో జీవతాదాత్మ్య మనుభవసిద్ధము. కావున జీవులచే నీశ్వరునితోఁ దాదాత్మ్యమును బొందుటకై ప్రత్యభిజ్ఞ యాశ్రయింపనగును.

ప్రత్యభిజ్ఞ యన 'నేను ఈశ్వరుఁడను. ఈశ్వరునికంటె భిన్నుఁడను గాను.' అను సాక్షాత్కారము. కేవల మట్టి సాక్షాత్కారము చేతనే శ్రేయస్సు, మోక్షముఁ గూడ లభించును. మోక్షమునకయి

ప్రాణాయామాదులయపేక్ష వీరిమతమున లేదు. శరీరము నెండింపఁజేయుట, భస్మస్నానము, జపము, పరిచర్య చేయుట మోక్షమున కనవసరము.

ఈశ్వరునివలెనే జీవుఁడు చైతన్యస్వరూపుఁడయినను మాయావృతుఁడగుటచే నీశ్వరాంశమై భాసించుటలేదు. ఈశ్వరునివలె పరిపూర్ణచైతన్యస్వరూపుఁడై భాసించుటకుఁ బ్రత్యభిజ్ఞ యత్యంతాపేక్షితము. ప్రత్యభిజ్ఞాబలముచే "పూర్ణచైతన్యాత్మత్వమే మోక్షము" అని ప్రత్యభిజ్ఞాదర్శనకారులయభిప్రాయము. ఈవిషయమై పెద్దల యూహా యిక్రిందిరీతిది—

శ్లో. తైస్తైరప్యుపయాచితైరుపనతః తన్వ్యాః స్థితోఽప్యంతికే
కాంతో లోకసమాన ఏవమపరిజ్ఞాతో న రంతుం యథా,
లోకస్యైష తథానపేక్షితగుణః స్వాత్మాపి విశ్వేశ్వరో
నైవాయం నిజవైభవాయ తదియం తత్ప్రత్యభిజ్ఞోదితా.

---

## రసేశ్వరదర్శనము

పారదము (పాదరసము) మున్నగు శబ్దములచే వ్యవహరింపఁబడు నేరసము కలదో యారూపుఁడగు నీశ్వరుఁడు రసేశ్వరుఁడు. ఈరసేశ్వరుఁడు శరీరమునకు దృఢత (బలము) నొసంగి ముక్తికి హేతువగు నని తలంచు మహేశ్వరులు రసేశ్వరులనఁబడుదురు. వారలచే రచింపఁబడిన దర్శనము రసేశ్వరదర్శనము.

వీరిమతమునను జీవాత్మలు చైతన్యస్వరూపులగుటచే నీశ్వరస్వరూపులే. పాదరసమును సేవింప దానివలన నగుశరీరదార్ఢ్యముచే నీశ్వరత్వప్రాప్తిరూపమగు జీవన్ముక్తియగును. ఆజీవన్ముక్తినే మోక్షముగ నంగీకరింతురు. జీవించియుండఁగా నగుముక్తి జీవన్ముక్తి. ముక్తియన మూలాజ్ఞానము నశించుటచేత నగునిజస్వరూపావాప్తి. అది జ్ఞానముచే సాధింపవలయును. 'తమేవ విదిత్వా; అని శ్రుతి. ఆత్మతత్త్వవిషయమగు

తెలిసికొనే జ్ఞానము. 'తత్త్వమసి,' మొదలగువాక్యములవలనఁ గలుగు జ్ఞానమే మోక్షసాధనము. ఆజ్ఞాన మభ్యాసాతిశయమువలన లభించును. అభ్యాసము చేయవలయు నన్నచో శరీరబల మత్యంతావశ్యకము.

శ్లో. ఇతి ధనశరీరభోగా న్మత్వానిత్యా న్సదైవ యతనీయం,
ముక్తౌ సాచ జ్ఞానాత్ తచ్చాభ్యాసాత్ సచ స్థిరే దేహే.

శరీరస్థైర్యము పారదాదిశబ్దవాచ్య మగురససేవనముచే లభించును. అట్టిరసమునకు పారద మనుపేరు 'పారం దదాతి పారదః, అను వ్యుత్పత్తిచే సంసారముయొక్క యవ్వలిగట్టును బొందించుటచేఁ గలిగినది. దీనివిషయమునఁ బెద్దలు —

శ్లో. సంసారస్య పరం పారం దత్తేఽసౌ పారదః స్మృతః
పారదో గదితో యస్మాత్పరార్థం సాధకోత్తమైః.

అని చెప్పిరి. ఈ పారదరసము సాక్షాత్తు మోక్షము నొసంగఁజాలదని యును మోక్షసాధనాభ్యాసమునకుఁ గావలసినశరీరపాటవము నొసంగి మోక్ష మీయఁగల దని వీరియాశయము.

కావున జీవన్ముక్తిఁ గోరుప్రతిమానవుఁడు మొట్టమొదట పాద రసమును సేవించి శరీరపుష్టిని సంపాదింపవలయును. అనంతర మాత్మ తత్త్వ మభ్యసింపవలయును. ఆయభ్యాసమువలన మిథ్యాజ్ఞానము సమూలముగ నశింప జీవన్ముక్తి యగు నందురు

ఇతరదర్శనకర్తలు శ్రవణము, మననము నిదిధ్యాసనము, మున్నగుసాధనములచే జీవన్ముక్తి యగునందురు వీర లంగీకరించినరీతిని జీవన్ముక్తి నొప్పుకొనరు. మఱియు శ్రు. తస్య తావదేవ చిరం యావన్నవిమోక్ష్యే అథ సంపత్స్యే; శ్లో. వద్ధన్యేఽపి ముక్తిస్తు దర్శితా పిండపాతనే, కరామలకవ త్సాపి ప్రత్యక్షా నోపలభ్యతే" అని శ్రుతిస్మృతులందు దేహపాతానంతరమే ముక్తి చూపఁబడినది. ఈపరిదృశ్యమానమగు దేహము మూఁడుకోశముల (ధాతువుల)చే నిర్మితమని ప్రసిద్ధము. వానిలో చర్మము, రక్తము మాంసము, అనుమూఁడు కోశములు తల్లి

శరీరము వలన వచ్చును. మేదస్సు, ఎముకలు, మజ్జ యనెడి మూఁడు కోశములు తండ్రివలనఁ బొందఁబడును. ఇట్టియాఱుకోశముల వలన నిర్మింపఁబడినయాశరీరము నాశమునొందుట యెల్లరకుఁ బ్రత్యక్షము. అట్టిసమయమున జీవించియుండఁగా జీవన్ముక్తి (శాశ్వతకైవల్యము) కాంచుట యెట్లును పొసఁగ దని యందురు.

కాని తల్లిదండ్రులవలన నగు షాట్కౌశికదేహమున కస్థిరత (నాశము) అగుఁగాక. పారద, అభ్రక పదములచే వ్యవహరింపఁబడు హరగౌరీసృష్టివలన నయినశరీరము నిత్యము (అనపాయము.) అందు హరసృష్టి పారదము గౌరీసృష్టి, అభ్రకము. ఇట్లీవిషయము ప్రతిపాదితము-

శ్లో. అభ్రకస్తవ బీజంతు మమ బీజంతు పారదః

ఈశ్వరుని శరీరమువలనఁ గలిగినదగుటచేఁ బాదరసమునకు 'రసేశ్వర' మనడిపేరు ఇట్టిరసేశ్వరమును (పారదమును) సేవించుటచే దాని సంపర్కము వలన ననపాయమగుశరీరము లభించు షాట్కౌశికదేహముఁ గూడ ననపాయి యయినిలుచును. మఱియు నీషాట్కౌశిక దేహము గౌరీసృష్టివలన నగుశరీరసంపర్కముచే దివ్యము, దృఢతరము, కూడ నగును. లోహము పారదభేద మగుకరుసవేధిసంబంధమువలన సువర్ణమగుట యనుభూతము. రసార్ణవమున నీవిషయ మిట్లుచర్చింపఁబడినది.

శ్లో. యేచాత్యక్తశరీరా హరగౌరీసృష్టిజాం తనుం ప్రాప్తాః
ముక్తాస్తే రససిద్ధాః మంత్రగణః కింకరో యేషాం.

అట్టిమహాజనకు జీవించియుండఁగనే ముక్తియగుటలో విప్రతిపత్తి యేమియు లేదని వీరి రాద్ధాంతము.

కావున దర్శనకారులచే నంగీకరింపఁబడిన జీవన్ముక్తి కరతలామలకమువలె రసేశ్వరసేవనముచేఁ బ్రత్యక్షమగుటలో సందేహమేమియు లేదు. జీవన్ముక్తియే లేదను రామానుజాదు లుపేక్షార్హు లని వీరియభిప్రాయము.

శ్లో. యస్స్యాత్ ప్రాకరణాదిమోచనధియాం సాధ్యః ప్రకృత్యా పృథక్
సంపన్నః సహ తేన దీవ్యతి పరం వైశ్వానరే జాగ్రతి
జ్ఞాతో యద్యపరం నవేదయతి చ స్వస్మాత్స్వయం ద్యోతతే
రసో బ్రహ్మైవ స ద్వైతసంస్కృతిభయా త్స్వాపోయా దశా పారదః.

ఈవిధముగ రసమునకుఁ బరబ్రహ్మ సామ్యాంగీకారమునకు 'రసోవై సః రసం హ్యేవాయం లబ్ధ్వా నందీ భవతి, అను మూర్ధన్యప్రమాణమగు శ్రుతి యున్నదని వీరిగర్జనము.

---

## పాణినిదర్శనము.

పాణినిచే రచింపఁబడిన సూత్రములు, వానిననుసరించి రచించిన వార్త్తికములు, భాష్యమునుఁ గలసి 'పాణినిదర్శన' మనఁబడును.

వీరలు జగత్తునంతకుఁ గారణముగ నద్వైతులు బ్రహ్మము నొకఁడే తత్త్వముగ నంగీకరించినట్లు 'స్ఫోట' యనుపేరుకల, నిరవయవము, నిత్యము నగు 'శబ్ద'మనుతత్త్వము నంగీకరింతురు దానినే బ్రహ్మ మందురు. వాచకమగు స్ఫోటశబ్దమునకు వాచ్యమగు బ్రహ్మకు నభేదమగుటచే 'స్ఫోట' యే శబ్దబ్రహ్మ మగుటకు సందియము లేదందురు.

మఱియు శబ్దములన్నియు నర్థము చెప్పునపుడు నాయాయి సత్తలను (స్థితులు) జెప్పినను నాయాసత్తయంతయు బ్రహ్మసత్తయగుటచే బ్రహ్మమే యన్నిశబ్దముల కర్థమయి యుండును. కావుననే శబ్దము నుచ్చరించినను బరబ్రహ్మోపాసనవలనఁ గలుగు ఫలితము (పుణ్యము) లభించును. 'యోఽర్థస్స శబ్దః యశ్శబ్దస్సోఽర్థః' యను తాదాత్మ్యము వీరికభిమతముగదా. ఇట్టి శబ్దగతోపాసన శుద్ధముగాఁ జేసిన బ్రహ్మము నొందుటయందు సందియము లేదని వీరలయభిప్రాయము. స్మృతి. శ్రుతి

"శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి".

"ఏకశ్శబ్దః......కామధుగ్భవతి......అని. జీవుఁ డనియు నీశ్వరుఁడనియు భేదము లేనియద్వయతత్త్వమునకు భేద మెట్లు కల్పిత

మీ యోటులనే వాచకమనియు, వాచ్యమనియు, వానికి సంబంధమనియు, నిదియంతయుం గల్పితమే. కావున నట్టి స్ఫోట బ్రహ్మకులకుం గలవాస్త విశైక్యము గాంచుచోం బ్రహ్మగభిన్నము, స్వయంజ్యోతిరూపము నగు బ్రహ్మ మభివ్యక్త మగును. అయ్యదియే మోక్షము. స్ఫోటరూపమగు నీబ్రహ్మమునందు రజ్జువునందు సర్పమువలె నీప్రపంచ మంతయు వివర్త భావము నొందును. కావుననే యాద్యసృష్టియంతయు శబ్దరూప మయి నది. ఈవిషయమును శ్రుతిస్మృతులైకకంఠ్యముతో నిట్లు నుడివినవి.

శ్రు "ఋఙ్మయో యజుర్మయః సామమయో వైరాజః పురుషోవై యజ్ఞః తస్యైతా లోకం కృణ్వస్త్విష ఆవహతయ స్త్రావై త్రయో లోకాః"

శ్రు. "ఏష వై ఛందస్యః సామమయః ప్రథమో వైరాజః పురుషో యోఽస్య మసృజత, తస్మ త్పశవోఽజాయంత. పశుభ్యో వనస్పత యో వనస్పతిభ్యో దిశః"

శ్రు వర్ణేన విశ్వా భువనాని జజ్ఞే తాని ఇక్ష్వర్వ మమృతం యచ్చమర్త్యం." అని

స్మృ. సూత్రభాష్యమున "శబ్ద ఇతిచేన్నాతః" అను సూత్రముచే శబ్ద పూర్వకముగ సృష్టి చెప్పంబడినది. దీనిని నాచార్యులవా రిట్లు నిర్ణయించి యున్నారు. "కథంపున రవగమ్యతే శబ్దాత్ప్రభవతి జగదితి ?" "ప్రత్యక్షానుమానాభ్యాం" ప్రత్యక్షం శ్రుతిః ప్రామాణ్యం ప్రత్యనపేక్షత్వాత్. అనుమానం స్మృతిః, ప్రామాణ్యం ప్రతి సాపేక్షత్వాత్.

శ్రుతి. "సమనసా వాచా మిథునం సమభవత్."

స్మృతి. అనాదినిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా
ఆదౌ వేదమయీ దివ్యా యతః సర్వాః ప్రవృత్తయః
నామస్వరూపం భూతానాం కర్మణాం చ ప్రవర్తనం
వేదశబ్దేభ్య ఏవాదౌ నిర్మమే స మహేశ్వరః

సర్వేషాం తు స నామాని కర్మాణాం చ ప్రవర్తనం
వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్సంస్థాశ్చ నిర్మమే.

అని పరబ్రహ్మము శుద్ధస్వరూప మయినచో నీస్ఫోటశబ్దము వ్యక్తమగుపరబ్రహ్మస్వరూపముగా నుండును. ఎప్పుడు పరబ్రహ్మమునకు శక్తితో సంబంధము కలుగునో యప్పు డాఘాతము (దెబ్బ) కలుగుటచే సూక్ష్మత్వం కలుగ స్ఫోటశబ్దము వ్యక్త మగును. దానినుండి 'బహుస్యాం ప్రజాయేయ' అను ప్రాథమికేచ్ఛారూప మగు కార్యము జనించును. ఆ యిచ్ఛానంతర మనేకము లగు పదార్థము లుత్పన్నము లగును. పదార్థము లన్నియు నవిద్యాకల్పితము లగుటచే వాస్తవికములు కానేరవు. కావున స్ఫోటరూప మగుపరబ్రహ్మన కాశమునుండి వివర్తరూపముగ మాయికమగు నిసర్గసృష్టి యగుటచే నాస్ఫోటబ్రహ్మమును శుద్ధముగఁ దెలియుటవలన మోక్షము కలుగునని వీరి నిశ్చయము. ఈవిషయమునకయి పెద్దల యభిప్రాయములు.

'అనాదినిధనం బ్రహ్మ...'

'స్వరూపజ్యోతిరేవాంతః సూక్ష్మా వాగనపాయినీ
తస్యాం దృష్టస్వరూపాయాం అధికారో నివర్తతే.'

"ఇద మాద్యం పదస్థానం సిద్ధిసోపానపర్వణాం
ఇయం సా మోక్షశాస్త్రాణా మజిహ్మ రాజపద్ధతిః

'అక్షరాణా మకారస్త్వం స్ఫోటస్త్వం వర్ణసంశ్రయః' అని.

స్ఫుటత్యర్థోఽస్మాదితి స్ఫోటః అను వ్యుత్పత్తిచే స్ఫోట యన శబ్దము. వాక్కు శబ్దము నాలుగు తెఱఁగులది. పర - పశ్యంతి - మధ్యమ - వైఖరి యని. అందు మూలాధారచక్రమునఁ గలవాయువునకు సంస్కారకము మూలాధారస్థము, శబ్దబ్రహ్మరూపము, స్పందశూన్యము, బిందురూప మయినది 'పరావాక్కు.' నాభిపర్యంతము వచ్చిన వాయువుచే నభివ్యక్త మయిన మనస్సునకు గోచరించునది 'పశ్యంతీ వాక్కు.'

(సశేషము)

10. మఱియు నీసందర్భముననే

"అతను దళదిశావిజయకీర్త్యంకురముల
మీఁద మఱపుగ వెలువడి మెఱయు నిత్తు
లతిపదనఖములు వానియంతికమునఁ
జెలువ కిసిన లతావిశేషంబు మేరు"

(౭. ౧౩౭. వా. బ ౧౪౧. ప్రా.)

ఇట "వెలువడి మెఱయునిత్తు. క, ఖ గ. మెఱయు. ఘ. వెలువడు మెఱయు. నా సవరణ" అని చిత్తులో వ్రాయించిరి. "మఱుపు పగ వెలువడు మెఱయు నిత్తు" అని మూలమందు దిద్దిరి. ఇట నీ దిద్దుపాటక్కఱ లేకయే పద్యార్థము సరిపడఁగలదు.

ఈ యువతియొక్క పైభాగమున నున్న పదనఖములు మదనుని విజయకీర్త్యంకురములపై భాగముననున్న ప్రకాశించుచిత్తులవలె నున్నవని యన్వయము. అంకురముల మార్దవము వ్రేళ్లకును బీజభాగముల పోలిక గోళ్లకును గలదని ఫలితము.

11. (౭. ౧౪౭ ప్రా.) పద్యమున మధురలాలస క్రీఁగంట విభుని గాంచినపుడు ఆకన్నులు రెండును ఎదురుపడు రతిస్మరుల యందలములవలె నున్నవని వర్ణించు సందర్భమున వర్ణ్యమా పద్యమునందు లోపించి ముద్రితముల నున్నది. 'తృష్ణఁ బొలిచ' అన్నది ముద్రణ ప్రమాదము. 'కొలుకులు దలిర్ప' అని వ్రాఁతల్లి సర్వతిపాఠములు. 'కొలుకులందలిర్ప' అని బయారి ప్రతి. ఇందు 'దృష్ట్లు' అను పాఠము 146 నంబరు గల తంజనగరప్రతిలో దొరకినది. 'కొలుకులందలిర్ప' అను పాఠము శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు వెత్తినదే. మఱియు నిందలి 'కడవల్లి' అన్నచోట 'కడవల్లు' అని చిన్నయసూరి పాఠము. 'పట్టుపడాల' అన్నచోట 'పట్టునడాల' అనియు 'కొలుకులందలిర్ప' అనియు నెల్లూరుప్రతి పాఠము. వీనినుండి యన్వితమగు పాఠము గ్రహింపఁబడినది. మఱియు నీపద్యమందలి 'అబ్బురపుదండెలు' అని ముద్రిత

(14) శ్రీనారాయణులకథ పద్యసంశోధనమున :—

"అరము పరిణాహము పసఁగా
కరఘు పన్నగశయను లచట కలకాహ్న దము
క్రొత్తరకితకలితల..." వ. ౨౧౦ మల్లా

మా ప్రతియం దిచట నీపాఠ మిట్లే యున్నది. ఇట మల్లాదిప్రతి "కలహాన్న. పు. ౫. లలో వ్రాఁత సందిగ్ధముగా నున్నది." అని చిత్తులో సూచించినది. ఇట నూతనప్రతియందు :—

"కరఘు పన్నగశయను లచటఁ గలుకొన్ననదము
క్రొత్తరకితకలితర..." వ. ౨౧౭ ప్రా.

అను పాఠము గ్రహించినది. ఇది 'కలహాన్న, కలకొన్న' అను వానికన్న సుందరముగా నున్నది. అర్థము సరిపడినది.

(15) అద్యంతవర్ణనావసరమున :—

"చెలువొందు మాణిక్యసింహాసనమున స
హస్రదళాబ్జకర్ణంబునందు" వ. ౨౨౮ వా.

"...స,హస్రదళాబ్జకర్ణాంతరమున" వ. ౨౨౬ మల్లా.

ఇట పీఠ "కర్ణంబునందు, అన్నిట యతి పోయినది. సవరించి తిద్దు." అని పెన్సిలుతో చిత్తులో వ్రాయించియున్నారు. ఇట నేలూరి ప్రాఁతప్రతిలో "స, హస్రదళాబ్జమధ్యంబునందు" అని గఱుస్తమైన పాఠము లభించినది. యతియు సరిపడినది. ఈపాఠమే నూతనప్రతి చేకొన్నది. (చూ. వ. ౨౩౪ ప్రా.) కాన నిట సవరించుట కవసరము లేదు.

ఇంకను కొన్ని స్థలముల శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు పాఠములను 'నాసవరణ' అనుచు సవరించిరి. మఱియు వారు తాళపత్రప్రతులు గాంచినపుడు కొన్నిచోట్ల విధిగా నుండితీరవలసిన పాఠములు వానిలో లభ్యములు గామి వానిని దమ్మునిసరిగా దిద్దియుండరు. దిద్దకున్న వాని కన్వయము లేదు. అట్టిదిద్దుపాటులు నూతనప్రతి "తిరుపతి, ఏలూరు, తంజనగర" ప్రతులయందు లభించినట్లు చివర

'నూతనపాఠము' లలోఁ జూపినది. ఇట్లే, సరస్వతీ వారిప్రతులందు యావత్తు లక్షణలక్ష్యములుగాఁ గానరావు. వానిని సర్వతోభద్ర బంధ ప్రత్యేకముగా వివరించక పద్యసంఖ్యలను మాత్ర మిచ్చుచున్నాను. ఈ వరి నూతనపాఠములలోఁ జూచి శ్రీశాస్త్రిగారి మిగిలిన "సవరణలు" ఏయే ప్రతులయందు దొరకినవో పాఠకులు సూక్ష్మముగ గ్రహింతురుగాక.

| ఆశ్వాసము. | వావిళ్లాదిప్రతిపద్యసంఖ్య. | నూతనప్రతిపద్యసంఖ్య. |
|---|---|---|
| 3 | 58 | 60 |
| 3 | 157 | 158 |
| 4 | 20 | 21 |
| 4 | 181 | 182 |
| 4 | 203 | ·205 |
| 5 | 64 | 64 |
| 5 | 69 | 69 |
| 7 | 78 | 78 |
| 7 | 100 | 102 |

ఇట్లు శ్రీసూర్యనారాయణశాస్త్రిగారు చేసిన 'సవరణ' లలోఁ గొన్ని చేయనవసరము లేనివియుఁ, గొన్ని ప్రతులలో నున్నవియు నైయున్నవి.

## యతిభంగములు.

మఱియు నీకళాపూర్ణోదయముద్రితప్రతులలోఁ బెక్కుతావుల యతిభంగములు గానవచ్చుచున్నవి. వ్రాఁతప్రతులు గాంచుచో నీయతిభంగము లేగక పఠితకము లగుఛందోభంగములుగూడ నుత్పత్తిస్థలంగ నుండును. ప్రకృతము వాని నంటక, వావిళ్లవల్లాదివారిప్రతులందు గోచరించినయతిభంగములను, వానికడ నూతనప్రతి గ్రహించిన సాధుపాఠములను జూపెదను.

9, "తెలినవ్వుడాలుము త్రియపుం జౌశట్లఁ బెంటఁగ నర్మసచివుతో సరస మాడు. గీ. ౧౧౩ వావి. అని వావిళ్ళవారి పాఠములు. ఇది సీసపద్యపాదము దీని రెండవభాగమున యతి చెడినది

"పెం, చఁగ నర్మసచివుతో సరస మాడు, అని సరస్వతీ ప్రతి పాఠము. ఇటుపఠనము చేయుటం యతి సరిపడినది. మల్లాదివారి పాఠమును గూడ నిదే (చూ గీ. ౧౨౧ మ.) క్రొత్త ప్రతియు పై పాఠమునే గ్రహించినది. (చూ గీ. ౧౨౧ క్రొ.) ఇట్లు పఠనము చేసుకొనుట నీ కావ్యమునఁ బలుతావులఁ గలదు.

10. "ఉ,య్యాల నిడి యూఁపు చోఁ గువలయాధిపు పాటలు..." ౬. ౧౯గీ. వావి. సరస్వతీపాఠములు స్వరమైత్రి లేక యున్నవి. ఇది యచ్చుల తప్పు యనుకొన్నను సరిపడదు. చంపకవృత్తపాద మిది.

"ఉ,య్యాల నిడి......కువలయాధిపు పాటలు" అని నూతనప్రతి సవరించుకొన్నది. మల్లాదివారిప్రతిగూడ నిట్లే యున్నది. (చూ. ౬. ౧౯౬ క్రొ. ప్రతి)

11. గు,జ్జనగూ శ్లి,చ్చనగండ్లు పింపిళులు ఉచ్చైల్......" (౬. ౨౦౨. మల్లా.) ఇట స్వరమైత్రి లేమి యతి చెడినది. మాత్రల ప్రమాద.మనిన ననవచ్చును. బహూరు సరస్వతీప్రతులు "గు,జ్జనగూ శ్లి,చ్చనగండ్లు......ఉచ్చైల్..." అని గ్రహించినవి ఇందును స్వరమైత్రి చెడినది. ఇది మత్తేభపాదము.

"గు,జ్జెంగగూ శ్లి,చ్చనగండ్లు......ఉచ్చైల్..." ౬. ౨౦౨. అని వావిళ్ల పాఠము. ఈ పాఠమే నూతనప్రతి గ్రహించినది. (చూ. ౬. ౨౦౩ క్రొ.) ఇందు యతి సరిపడినది.

12. "అనదృశభూషణాన్వితవిలాసవిచిత్రతనొప్పు..." పూర్వ ముద్రితములందును మల్లాదివారిప్రతియందును నిచ్చట యతి లేక యున్నది. ఇది చంపకపాదము. విలాస్వకబ్రమందలి యను వి గునది కాదు. కొందఱు దీనిని "ఘుణ్ యతి" యని యందురు గాని,

అని యొక్క "తలాప"శబ్దమును గూర్చియే చెప్పుట. ఇటఁగొన్నిప్రాఁతి ప్రతులలో "అనవద్యశభూషణాసితశిలాదివిచిత్రిత... ..." అను పాఠ మున్నది. ఇట యతి సరిపడినది. అర్థపుష్టిమాత్రము లేదు. దీనికడ నేలూరిప్రతిలో,

"అనదురుభూషణాన్వితవిలాసవిచిత్రిత... ..."

అని యతి సరిపడినపాఠ ముపలబ్ధమైనది. దీనినే నూతనప్రతి గ్రహించినది. (చూ. ౭. ౧౦౩ గ్రం.)

(13) "... ... పైనిడినయుం, బరపుదండెలుపోలె బొమలు దనర" ౭. ౧౭౪ మ. ప్ర. ఇది సీసము. దీనిఖండమున మల్లాదివారి ప్రతిలో నియతి లేనిపాఠ మున్నది. వీరు పేజిక్రిందఁ జత్తులో "అబ్బురపు వ. ఫ. బ." అని యతితప్పనిపాఠము నుంచిరి. బహూరిప్రతియు నిట్లు గ్రహించినది,

"అ, బ్బురపుదండెలుపోలె బొమలు దనర" అని వావిళ్ళసరస్వతీప్రతులపాఠము. ఇందు యతి సరిపడినది. నూతనముద్రణ మీపాఠమే గ్రహించినది (చూ. ౭. ౧౭౮ గ్రం.)

(14) "కోరి చంద్రుఁడు వడిమట వ్రాలఁజొచ్చె" ౮. ౨౩ అని బహూరువావిళ్ళప్రతులు. ఇది గీతపాదము. ఇందు యతిగాని ప్రాసయతిగాని లేదు. దీనికడ సరస్వతీప్రతి "కోరి చంద్రుఁడు వడమటఁ జేరఁ జొచ్చె" అని గ్రహించి ప్రాసయతిగా సవరించుకొన్నది.

"అంతకంత, కోలఁ జంద్రుండు వడమట వ్రాలఁజొచ్చె" ౮. ౨౪. అని యతితప్పనిపాఠ మేలూరిప్రతియం దున్నది. నూతనప్రతి యాపాఠమే గ్రహించినది. మల్లాదిప్రతియు నిట్లే యున్నది.

(15) "బిరుదావళులు వందిజనులు చదువ" ౮. ౩౧. మ. ప్ర. మల్లాదివారియతిలేనిపాఠము గ్రహించిరి. మరియు వీరిటఁ జత్తులో "వందివరులు వ. ఫ. బ." అని స్పష్టపాఠము స్వతంత్రాన మొనర్చి యతి తప్పినస్థానిని మూలమునఁ జేర్చిరి. మిగిలినముద్రితములందు "బిరు

దావళులు వంటివరులు చదువ" అని వ్రాసయతి గలపాఠ మున్నది. నూతనప్రతియు నీపాఠమునే గ్రహించినది (చూ. ప. ౩౧ శ్రీ.)

(16) "బెదరుట లేక మైదుపడిసేయక పారి..." ప. ౧౦౦. వా. ఈపాఠమున యతి పోయినది ఇది చంపకవృత్తపాదము. ముద్రితము లన్నిట నీపాఠ మిట్లే యున్నది.

"కన్, చెదరుట లేక మైదుపడిసేయక..." అని యేలూరిప్రతి పాఠము, ఇందు యతి సరిపడినది. నూతనప్రతియు నిద్దానినే గ్రహించినది. (చూ. ప. ౧౦౨ శ్రీ.) మల్లాదివారిపాఠము నిదియే

(17) "అద్వైతపరుల కసాధ్య మగుచు" (ప. ౨౨౦ వావి.) పై రీతి యతిలేనిపాఠము వావిళ్లప్రతి గ్రహించినది. ఇది సీసపాదశక లము. "అద్వైతపరుల కప్రాప్య మగుచు" అని బయూరిసరస్వతీప్రతులు గ్రహించినవి. దీనినే నూతనప్రతి గ్రహించినది. (చూ ప ౨౨౬. శ్రీ.) మల్లాదిప్రతియు నిట్లే యున్నది.

(18) "...స, హృత్పదశాఖ్యపద్మంబునందు. (ప. ౨౨౮. వావి) ముద్రితప్రతు లన్నిట నీరీతి యతితప్పినపాఠమే యున్నది.

"స, హృత్పదశాఖ్యపద్మాంతరమున" (ప ౨౨౬ మల్లా.) అని మల్లాదివారిపాఠము. ఇట యతి సరిపడినది.

"...స, హృత్పదశాబ్జమధ్యంబునందు" 'అనియేలూరిప్రతిపాఠము. ఈపాఠమును నిర్దుష్ట మగుటచే నూతనప్రతి దీనినే గ్రహించినది (చూ. ప. ౨౩౪. శ్రీ.)

"కేలఁ గలభాషిణిని విడకే చనంగ." ౩. ౧౩౨. శ్రీ.

"కేలం గైదువు గీదు వేమియును లేకే యిమ్మోయి స్వత్తురే?" ౩. ౧౨౭. శ్రీ,

ఈపై పాదములలోనియతులం దొకచోట నవధారణార్థకస్వరము విరుగుచున్నది. రెండవకడ నఖండముగా నున్నది. ఇది యఖండయతు లని కొందరిమతము కాని యవధారణార్థకస్వరముతోఁ గలసినట్లు

# నన్నెచోడుని వర్ణనానైపుణి.

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

---

సంస్కృతకవులు రసైకరసికులు. వారు తమకావ్యములలో కథాసూత్రము కథానాయకపురాణాదుల నుండి గ్రహించియు రసానుగుణముగ నటలేని యంశములను గొన్ని క్రొత్తగఁ గూర్చియు, నటనున్నవానిఁ గొన్నిటిని విడిచియుఁ గావ్యమును నూతనవిధానమునఁ జేకూర్తురు. రసపరిపుష్టి కనుగుణముగు భావములు భావశైలి మున్నగు సాధనములు చేకూర్చుకొని రచన సాగింతురు. తెలుఁగుకవులు వర్ణనాపరతంత్రులు. కథానుగతికముగ నష్టాదశవర్ణనలు తమప్రబంధము లందు కొదువక పొదిగింతురు. అందును నన్నెచోడుఁడు మిక్కిలి ప్రాచీనుఁడే యైనను నీవర్ణనల కాఁతే శ్రీకారము చుట్టినాఁ డనవచ్చును. అంతకుముందు వెలసిన పురాణానువాదముల నిట్టి వర్ణనలు లేనేలేవనుట మాత్రము గాదు. ఉన్నను ప్రాధాన్య మింతగ వహించియుండలేదు.

ఈ ప్రసంగమున మన మొక్కమాట యనుకొనవలసి యున్నది. అర్వాచీనప్రబంధకవుల కృతులన్నిటిలోను పురవర్ణనము సూర్యోదయ సూర్యాస్తమయవర్ణనములు, చంద్రోదయ చంద్రాస్తమయము విరహవర్ణనములు, మృగయావర్ణనము, నాయికానాయకుల పాదాదికేశాంతవర్ణనము మున్నగునవి తప్పక చూపట్టుచుండును. ఉత్తమకవుల కృతులలో మాత్ర మావర్ణన లొకదానికంటె మఱియొకటి వేఱ్వేఱై చూపట్టుచుండును. అట్టి వేర్పాటు నొనరించునవి ఆయాకవుల వాక్కు లుపయోగించిన భావపుష్టి తదనుగుణముగు భాషాపుష్టియును.

ప్రబంధకవులు ప్రకృతిదృశ్యములఁ జిత్రించుటలో సిద్ధహస్తులే కాని ప్రకృతికాంత నలంకారభరితగా నొనర్చి కలకలలాడు నామె సౌభాగ్యము మనకన్నులకుఁ గాన్పింపఁజేయుదురు. అంతియకాని యామె సహజసౌందర్యమును ప్రదర్శించునలవాటు వారి కెవ్వరికిని లేదు. వేయేల!

భారతీయసంస్కృతిలో సన్న్యాసాశ్రమము బోధించుటగాని, దానిని గొప్పదానిగాఁ జేసి వర్ణించుటగాని నాఁటికి నేఁటి కవులకు గాన్పింపదు. సముచితాలంకారభూషితమై నిగూఢమైన ప్రకృతిశోభను తాము కనులారఁగాంచి యానందించి, భావనానయనమ్మున దాని నితరులకుఁ గాన్పింపఁజేసి సహృదయహృదయముల నానందింపఁ జేయుటయే భారతీయకవుల యాదర్శము.

ఇఁక మహాకవిరాజశేఖరుఁడీ యట్టి ప్రకృతివర్ణనము నెట్లు గావించియున్నాఁడో కొంచెము పరిశీలింతము. పార్వతి హిమవత్పర్వతముపైఁ దపము నతితీవ్రతతో సాఁగించుచుండ షడృతువులు క్రమముగఁ బ్రవేశించి వానివాని వికాసమును బ్రదర్శించినవఁట. ఆయాఋతువర్ణనా ప్రస్తావమునందలి యారంభపద్యము లన్నియు నించుమించుగ నొక్కతీరుగ నున్నవి. ఇది యీతని కవితాశిల్పమునం దొక వైలక్షణ్య మనవచ్చును.

మ. గతసంతాపము శీతలీకృతమహీకాంతాంగము... ...ర
వ్యతరంబై కుతలం బనం బరగె వర్షారంభ మత్యున్నతిన్.
కు. సం. ౬. ౨౫౧.

మ. దళితాంభోరుహపత్త్రరుచిత సుమహాత్కాశాపనాథాంబు... అ
గ్గలమై శర్వ జగంబులం దురుకలత్కాలంబు రమ్యాకృతిన్.
కు. సం. ౬. ౨౬౯.

ఉ. శాంతదినాధిపప్రకరచండతరత్వము... దేశములందుఁ బర్వె హే
మంతము సంతతోదితతుషారవికార మనం బ్రగుణంబునన్.
కు. సం. ౬. ౨౭౩.

చ. పొలుపుగ నేచి చెట్లదరఁ బూచి విశేషముగాఁ గాచి... వచ్చె న
త్యలఘువసంత మూర్వర వసంతవిభూతి నిరంతరంబుగాన్.
కు. సం. ౬. ౨౮౯.

మ. స్ఫురదూరుదావపావకము శోషితసింధుచయోదకంబు...
... ... ...కటునిదాఘము పర్వె భయంకరాకృతిన్.
కు. సం. ౬. ౨౯౧.

పాంథు లనుశత్రువులను ఖండింపఁగా వారిదేహములనుండి కొల్లలైరక్త బిందువులు జారెనో యనున ట్లున్నవఁట.

క. కాంతు వీరుఁడు మెఱుఁగను
దోరసిఁ బాంథులను రిపులఁ దునిమినఁ దద్దే
హారుణబిందువులు దొరఁగెనొ
ధారుణి నన నింద్రగోపతతి విలసిల్లెన్.

కు. సం. ౬. ౭౯.

కవిరాజశిఖామణి కొల్వుకూటమునఁ దఱచుగ నృత్తగీతవాద్యముల సమ్మేళమునఁ గలుగు నానందమును స్వయముగ ననుభవించువాఁడు గావునఁ దన కావ్యమునఁ గూడఁ జలుకావుల నాట్యభంగిమలఁ గూర్చియున్నాఁడు.

వానకాఁ డను రాజు కొల్వుండఁగా నకట నెమిళ్లను నటకులు పింఛాగ్రముల నెత్తి భావము చిప్పిల నాఁడినవి. అట్టినాట్యమునకుఁ దమ కేకారవము లనంతగేయములైనవి. మేఘగర్జితములు త్రివిధమయిన వాద్యధ్వనులైనవి. ఇంద్రగోపములయు, పద్మములయు గడ్డిపరకలయుఁ గాంతులు గలిసినచోటులు పద్మరాగములు పచ్చలుఁ గూర్చిన రంగస్థలములై యొప్పినవి.

శా. ఆ క్రొక్కారను రాజు ప్రోలి నజరావానంతగేయాశ్రనా
దైకాతోద్యముఁ గూర్చి ప్రోయ సురగోపాంభోజరాగత్వణా
నీకోద్యద్ధరిదశ్మశష్ప మనన్న ప్రత్యూరరంగస్థలిం
గేకిపాత్రము లాడ భావముగ నుత్క్షిప్తాగ్రపింఛంబులై.

కు. సం. ౬. ౭౬౦.

ఈకవి కేకిచేఁ బ్రదర్శించిన నాట్యభంగిమయుఁగూడ ప్రశంసితము.

మ. గళనాదంబులు మంజుగానములుగాఁ గాంచీలసత్కింకిణీ
కలనాదంబులు నృత్తవాద్యములుగాఁ గాంతోరుకేళీస్మిత

స్థలరంగమ్ములఁ గాముఁ డన్నటుఁడు ప్రొద్దుగూడ నాడింపఁ గా
లలనాపాత్రము లాడి రొప్ప రతిలీలాలాస్యలోలాస్యలై.

కు. సం. ౮ ౧౮౦.

అట్టివర్షాసమయంబునం దంభోవాసినియై గౌరి ఘోరతపంబు సేయునవసరంబున నంత మైనయామె జడలపై గ్రొత్తవగు జలకణములు దగిలి మిక్కిలి వన్నెయీనె, యామహాదేవి యాచరించుతపమునకు డెందమున మెచ్చి దేవతలు ముత్యముల సేసలు కురిపించిన ట్లొప్పెనవి.

క. అమర నెఱిజడలపై ను
త్తమరుచినవజలకణములు దగిలి బెడంగై
యుమతపమున కెద మెచ్చి త
దమరులు ముత్యాలసేస లలిఁ గఁ భంగిన్.

కు. సం. ౬ ౨౬౬.

తదనంతరమున శరత్కాల మగ్గలమై జగములఁ బర్వఁగ నా శా రదవేళ వికసించిన పద్మములను గలువలనుఁ గాంచుటయు, అవియు జలమునఁ బవ్వళించిన హరియును లక్ష్మియును వర్షరాత్రులతుదిని మేలుకొని కన్నులు విప్పినారో యనునట్లొప్పెనవి. హరి యరవిందాక్షుఁడు, యిందిర యుత్పలాక్షియుఁ గాన నీయుత్ప్రేక్షయు నొప్పియున్నది.

క. జలశాయు లైన హరిల
క్ష్ములు వర్షనిశావసానమున మేల్కాంచి క
న్నులు విచ్చి చూచినట్టులు
జలజోత్పలరుచులు వెలసె శారదవేళన్.

కు. సం. ౬. ౨౨౦.

ఉ. తారకవీథిసీవిమలసాంద్రసుధాకరకాంతి రోదసీ
పూరితమై దినంబుల నభోమణిదీప్తిఁ దలంక కిమ్మగాఁ
జేరి ఘనీభవించె ననఁ జెల్లెగనె నృతమేదుహంసకం
బురుహాకరసంహతులు గిర్కొలిసె న్శరదాగమంబునన్.

కు. సం. ౬. ౨౨౫.

ఆశరత్కాలవేళ రాత్రులం దతిస్వచ్ఛమై దట్టమైనచంద్రకాంతి భూమ్యాకాశాంతరాల నిండినదై పగటియందలి దినమణిదీప్తిచే వ్యాపింపఁజాలక పేరుకొని ఘనీభవించెనో యనునట్లు తెల్లని మేఘములు పొందలు పద్మగుంపులు తెల్లపూలు క్రిక్కిరిసిపోయె నని కవి యుత్ప్రేక్షించినాఁడు.

అంతియగాక ఆవికసిన తామరపూవులతావి నాఘ్రాణించుటకు పండినశాలిసస్యముల నొఱగించినాఁడు.

క. శరదాగమమున శోభా
కరముగఁ గ్రొవ్వాలఁ బండి కలమవ్రంబుల్
గరువున నెఱయఁగఁ దామర
విరిపుప్పొడితావి కెఱఁగువిధమునఁ బొలిచెన్.

కు. సం. ౬. ౭౭౬.

ఈకల్పనకును మూలము కిరాతార్జునీయములోని యీక్రింది శ్లోకము.

శ్లో. అవిరామృథు స్తంభభృతః పిశంగతాం
గతా విపాకేన ఫలస్య శాలయః
వికాసివప్రాంభసి గంధసూచితం
నమన్తి నిఘ్రాతు మివాసితోత్పలం.

సం. కిరా. ౪. ౨౬.

నన్నచోడుఁడు కృత్యాదిని కవిస్తుతిలో భారవిని,

క. భారవియు వస్తుకవిని
భారవియును బరగి రుద్రయుపర్వతశిఖరా
గ్రారోహణోపక్రీలన
గారోహణవర్ణనల జనాధిపులై

కు. సం. ౧. ౨౦

అని పేర్కొని అర్జునుఁ డింద్రకీలపర్వతము నెక్కుప్రస్తావమునం దలి శరత్సమయవర్ణనమును దాను గొంతవఱ కనుకరించినాఁడు. ఈక్రింది పద్యమును గొంచెము మార్పులతోఁ గూడినది యట్టిదే.

ఉత్సాహ. అరుణశాలికణపములు శుకాలి గఱచుకొనుచు నం
బరతలమున నోలి నెగసి పాఱు దిగ్వధూచయం
బరయఁ జెలువ మెసఁగు శారదాగమమున నుత్సవో
త్కర విభాతిఁ దోరణములు గట్టినట్టు లందమై.

కు. సం ౭. ౨౨౨.

దిక్కులనెడి స్త్రీలు అందముతోఁ దులతూగెడు నాశరత్సమయమున నుత్సవములు పాటింపఁ దోరణములు కట్టినట్టులు చెలువ మెసఁగ శుకాళులు నోట నెఱ్ఱనైన వరివెన్నులు గఱచుకొని యాకసమున బారులుగట్టి పఱగెత్తినవి. కిరాతార్జునీయములో నీభంగి యున్నది

శ్లో. ముఖైరసౌ విద్రుమభఙ్గలోహితైః
శిఖాః పిశఙ్గీః కలమస్య బిభ్రతీ
శుకావలిర్వ్యక్తశిరీషకోమలా
ధనుశ్శ్రియం గోత్రభిదోఽనుగచ్ఛతి.

సం. కిరా. ౪ ౩౬

వికసించిన దిరిసెనపువ్వువలె మృదువైన యాశుకాళి పగడపుఁ దునుకవలె నెఱ్ఱనైన ముఖములచే పచ్చనగు కలమాగ్రములఁ గఱచి కొనుచు నాకసమున నింద్రధనుశ్శోభ ననుకరించుచున్నది. ఆశుకాళి నూఁతగఁ గొనియే మన సన్నెచోడుఁడు తోరణములఁ గట్టించినాఁడు.

శరత్కాలము తన కూఁతునకు భరింపరాని తాపము గలిగించు చుండుట గాంచి హిమభూధరాధిపతి శరదృతువుపై దండు వెడలెనో యనునట్లు మంచు తెఱ లెల్లెడల వ్యాపించెను.

క. శరదాగమంబు తనసుత
కురుపరితాపంబు సేయుచుండుట హిమభూ

న్యము నధిష్ఠించి నిలువఁజాలక తిరిగఁ గలఁబడుచున్నాఁడు. ప్రకరణాంతరమున నా ప్రసంగములఁ గాంచెదము.

అంతఁ బార్వతి వసంతానంతరమునఁ దతి సంతతాక్రాంత పూర్ణ ప్రాబల్యంతమనోమాది క్రియలం బ్రవర్తించుచుండునంత నిదాఘుడు భయంకరాకృతితోఁ బర్వెను. అగ్నివర్షముఁ దలఁచినఁ జెండము కందును పలికిన నోరంతయుఁ బొక్కిపోవును. అతని ప్రభ చూచినచో కన్నులు కమలిపోవును. ఇట్టులా వేసవిని ప్రళయానలము రీతి నుండ గాంచెను.

క. తలఁచినఁ జెండము గందును
 బలికిన నోరెల్లఁ బొక్కుఁ బ్రభ సూచిన క
 న్నులు గమరు నవఁగఁ బటుతర
 విలయానలభాతి నుండ వేసవిఁ గాంచెన్.

కు. సం. ౬. ౭౯౨.

ఇట్టి తీవ్రమైనట్టి గ్రీష్మవాతాహతిచే నేలఁగలగలలు పగిలి క్రమముగ లోపలి ముత్యములు చితికి మంగలములో వైచిన పేలాల రీతిని తూలిపడునట్లుగా బీతెండ గాసెను

గీ. ఉరునిదాఘవాతాహతిఁ గరఁగలతలు
 వ్రస్సి లోపలి ముత్యముల్ పరుప వీసి
 మంగలము లోని ప్రేలలభంగిఁ దూలి
 ప్రేలిపడఁ గాసెఁ గట్టెండ పిడుపరించి.

కు. సం. ౬. ౭౯౩.

ఎండవలని భయమున నీడలు చెట్లక్రింద దూరెనో, లేక యా వృక్షములు దప్పికచే పీడింపఁబడి తమనీడలు తామే త్రాగెనో, యనునట్లా గ్రీష్మసమయమున మధ్యాహ్నవేళ నెండల చలింపక యుండ నీడలు పెద్ద పెద్ద చెట్లమొదళ్లయందే యణఁగియుండెను.

ఉ. ఆతపభీతి నీడలు రయంబున మ్రాఁకుల క్రింద దూరెనో
 భూతరులుం దృషాభిహతులై తమనీడల దార త్రాగెనో

భాతి నసంగ క్రీడ లురుపాదప మూలములం దడంగ గ్రీ
ష్మాతతమధ్య వాసరములందు జగంబున నరుండు నుండలన్.

కు. సం. ౬. ౭౯౫.

క. ఖరకరకరహతి ముఖసర
సిరుహము కడు వాడి కాంతి సెడ నయ్యిందీ
వరము • • ర గిరిజముఖ
స్థిరశశికా్ంతి బగలు రేయి చేసెన్ యనఁగాన్

కు. సం. ౬. ౮౦౧.

తీక్ష్ణమైన సూర్యకిరణకాంతిచే పార్వతి ముఖపద్మము వాడి లి కృశించి కాంతి సెడఁగా కన్నులనుకలువలు, పార్వతి ముఖచంద్రకాంతిచేఁ బగటిని రాత్రిగాఁ జేసెనోయనున ట్లొప్పెను.

ఈశ్వరునిఁ గామవశవర్తిని జేయుటకై మదనుఁడు దండెత్తివచ్చుచు వసంతుని గూడివచ్చెను. అప్రకరణమైన వసంతర్తు వర్ణనము విరివిగఁ గావింపఁబడినది. వసంతోదయమునఁ బ్రాణిసామాన్యహృదయములకంటె కవిహృదయములు కందళించి యపూర్వవిలాసము నందును. వారలానసమయమున భావడోలికల నూయాలలూఁగి ప్రేక్షకులనైన మూఁగలాడింతురు కవిరాజశేఖరుఁడగు నన్నెచోడునిమాట యెన్న నేల?

వసంతుఁ డీశ్వరునకు తన మాచరించునను సాత్త్వించినంతనే శిశిరవిముక్తమగు దక్షిణదిక్పవనము బయలువెడలెను. దాని రాక తనకు శత్రువగు నుత్తరదిక్పతిస్త్రీతోఁ దనప్రియుఁడగు సూర్యుఁడు కవయఁబోవుట గని దక్షిణదిగంగన డెందమున నొచ్చుకొని వెచ్చని నిట్టూర్పు విడిచెనో యనున ట్లుండెను.

క. తనసూడగు ధనదదిశాం
గన నిముఁ డొడఁగూడఁబోక గని యామ్యదిశాం
గన నొచ్చి వెచ్చ నూర్చెనొ
యన శిశిరవిముక్త దక్షిణానిల మెసఁగెన్.

కు. సం. ౪. ౪౪౨.

ఈకవి ప్రభు వగుటచే భాషాప్రదర్శనమున సైతము తన ప్రాభవము కాన్పించఁజేసినాఁడు. మన్మథప్రభువు తుమ్మెదలు చిలుకలు కోకిలలు అను తన సేవకవర్గమునకు ప్రతిదినముఁగ వేతనము నీయ బైటఁబోసిన బంగారుప్రోఁగులో యనఁ బద్మము లందమై పూచెను.

క. భావజవిభుఁ డలిశుకపిక
సేవకతతి కెడరు దీఱ జీతము సేయం
గా వెలఁబోసిన పసిఁడుల
ప్రోవులనాఁ దమ్మితతులు బూచె బెడంగై.

కు. సం. ౪. ౪౪౮.

ఆవసంతసమయమునఁ గంకేళి పూచి తుమ్మెదలచే మూఁగఁబడిన పాంథవర్గమునకయి మన్మథుఁ డభిచారక్రియకు నల్పకుండమధ్యమున దగిలి పొగఁతో వైకెగయు నగ్నివోలె నొప్పెను. కంకేళిపూ లెఱ్ఱఁగను భృంగములు నల్లగను వ్యాపించుట నాభిచారికాగ్నితోఁ బోలిక యేర్పడెను.

గీ. పొలిచె మధువేళఁ గంకేళి పూచి భృంగ
పరివృతమ్మై మనోజుండు పాంథతతికి
నాభిచారంబు వేల్పుకుండాంతరమునఁ
దగిలి కామాగ్ని పొగఁతో నెగయునట్లు.

కు. సం. ౪. ౪౧౦.

విరహుల హృదయములను శిథిలముచేసి మన్మథుఁడు రాక్షసవృత్తితో నాయుధముల నూరఁబెట్టి చేఁగఁబూననో యనునట్లు ఎఱ్ఱకరవీరము లొప్పెను. పూవు లెఱ్ఱగ నుండుటచే నవి రక్తసిక్తాగ్రములవలెను, వానికి వెనుక నున్నయాకులు ఆయుధములకు వెనుక నుండెడి తొక్కులనఁగ నుండుటచే నిట్టి కల్పన కూర్చియున్నాఁడు కవి.

క. విరహుల హృదయంబులు జ
ర్జరితంబులు చేసి మరుఁడు కరకత్త్రములా

సురవృత్తిఁ బెటికి బట్టిన
కరణిం గర మొప్పె నరుణకరవీరంబుల్.

కు. సం. ౮. ౧౫౧.

క. నవ నవగు నళిగానము విని
వనదేవత కరము మెచ్చి వానికి నొసఁగం
జనఁ బైఁడులవీడు లు వు
చ్చినవిధమునఁ బొన్న లెలమిఁ జెలువుగఁ బూచెన్.

కు. సం. ౮. ౧౫౨.

ఇట్లు తుమ్మెదపాటలు విని సొక్కి, లొ మెచ్చుకొని వనదేవత లాయళుల కొసఁగుటకై బంగారు రాకులు ప్రోఁగులుగఁ బోసినోయన నట్లు పొన్నలు చెన్నుగఁ బూచినవి.

ఇఁక నీ వృక్షములచే ముత్యముల పందిరులు మణిమయహర్మ్యముల నిర్మించినాఁడు. సురపొన్నచెట్లపైఁ బ్రాఁకిన గురువిందలతలు పూవులతోఁగూడి పెరిగిన మన్మథుఁడు వసంతుఁడను విలాసి తయారు చేసిన ముత్యముల పందిరులవోలె నందముగ విలసిల్లినవి. సురపొన్నలు పందిరులవలెను, వానిపై నల్లుకొనిన గురువిందతీఁగలు జాలరుల వలెను, తెల్లని పూవులు ముత్యములవలెను శోభిల్లినవి.

క. సురపొన్నలపైఁ బ్రాకిన
గురివిందలు నసలఁ బెనఁగి కొమరు రమర రతీ
శ్వరునకు వసంతుఁ డనునొన
గరి చేసిన ముత్తియముల పందిరివోలెన్.

కు. సం. ౮. ౧౫౩.

ఆమని నామ్రమును జూచినంతనే అళులతోపాటు కోకిలములు వానితోపాటు కవికోకిలములు మధురగానాలాపము లొనరించును.

చ. మొగడలు వ్రజములు సిరులు ముత్తెము లింతగు నున్పుఁగెంపు లేఁ
జిగురులు పద్మరాగములు చిట్టలుపైఁ దొఁదాలు తుమ్మెదల్

నగరిపురీలలజాలములు నాఁ దనరారె వసంతవల్లభుం
డగువలరాజు పంచమణిహర్మ్యములో యనఁ జారుభూజముల్.

కు. సం. ౪ ౪౧౬

చూతవృక్షముల నీడవి వలరాజు వసించుటకు నిర్మింపఁబడిన యయిదువిధములగు మణులచే ఖచితమైన మేడలవగిది నొప్పారఁజేసి నాఁడు. మొగ్గలు వజ్రములు, పూవులు, మౌక్తికములు, ఇంపైన యెన్నని లేఁతచిగుళ్లు పద్మరాగమణులు, చిలుకలు పచ్చలు, తుమ్మెద లింద్రనీలమణులు. ఇట్లు వసంతవల్లభుఁడైన వలరాజు నివసించు సర్వమగు మణి ఖచితహర్మ్య మేర్పడినది.

మఱియు నీమ్రాను మొక్కటియే మనసిజునకు నయిదువిధము లయిన యస్త్రముల సంపత్తిని జేకూర్చునది. అంకురములు చిగుళ్ళు మొగ్గలు పూవులు ఫలములు క్రమముగ నున్మాదన మదన మోహన సంతాపన వశీకరము లనఁ దనరారిన యస్త్రము లైనవి.

క. చన నున్మాదన మదన మో
హనసంతాపనవశీకరాస్త్రము లన వ్రా
జనుపటు సంకురపల్లవ
ఘనకోరకపుష్పఫలనికర మామ్రమునన్.

కు. సం. ౪ ౪౧౬.

ఈ సహకార భూరుహచక్రవర్తియే యొకపరి శంభుమూర్తిదాల్చి యీకావ్యమున విలసిల్లి మనోజుని ఉదరిపడి రోమాంచరిల్లఁ జేసినాఁడు. మఱియు నీసహకారమే వసంతసంగతిఁ బులకాంగియై యొప్పి, పూవులను మందహాసములతో, మత్తిల్లిన తుమ్మెదలమధురగాన మను తీయనిపాటలతో, రాచిల్కలకల్కిలను ముద్దుమాటలతో, చెన్నగుపల్లవరాగ మనురాగముతో, కోకిల కుహూకార మనుమధురనాదముతో, నెమిలి పింఛములను కేశజాలముతో, రాలిన పండుటాకులను పొలపాలితో నొప్పు చూడఁదగిన విలాసముఁ దాల్చెను.

ఈ విలాసవతి నిట్టి నూతనాలంకారములతో భూషించి ప్రదర్శింపఁజేసిన కవివతంసుని ప్రతిభ సుశ్లాఘ్యము. ఇట్టి వసంతము కవివతంసుల కావ్యములందెక్కడఁ గానరాదు.

చ. అలరుల మందహాసమున వన్నినషట్పదమంజుగీతి రా
చిలుకలముద్దుమాటలను జెందలిరాకులరాగలీలఁ గో
కిలనినదంబులన్ బరిహాసకేళికరంబున ముక్తవర్ణమే
ఖల నభిరామమయ్యె సహకారలతాంగి మధుప్రసంగతిన్.

కు. సం. ౮. ౮౯౮.

ఇంతియె కాక యీ సహకారము వసంతసంగతిని వలరాజును బోలి యొప్పెను. చిగురుగొడుగుతో పుష్పబాణములతో, బలిసిన కోకిలలు చిలుకలు తుమ్మెదలు అను పరివారముతోఁ గూడ నట్టి సామ్యమేర్పడినది.

క. తలిరల్లిఁ బూవుటమ్ముల
బలిసిన పికకీరభృంగపరివారముతో
వలరాజుఁ బోలి మామిడి
సలలితగతి నుతవసంతసంగతి నొప్పెన్.

కు. సం. ౮. ౮౯౯.

ఇఁక మలయపవనము తుమ్మెదలు చిలుకలు కోవిలలు గావించిన విలాసములు విహారములు కడు హృద్యములు. ఆప్రకరణమునందలి శైలి హృద్యతరము. భావము లన్నియో కడు మధురములు. విస్తరభీతిచే వదలినాఁడ.

కాని యీ మధుసమాగమున సోలుచు, ప్రమోదరసమునఁ గ్రాలుచు వనమును పాలనసేయు బాలికలు నవనవలాడను తీఁగయుయ్యెలల నూఁగుచు క్రొత్తక్రొత్తపోకడల రాగాలాపములు చేసిరి. వారి పాటలతోఁ గలిసి పాడిన మధురగానము గావుననే నన్నెచోడుని వసంతము ప్రాక్తనమైనను నూతన మనిపింపకపోదు.

క. సోలుచు సమ్మదరసమునఁ
గ్రాలుచు వనపాలబాలికలు నవలతికాం
దోలికల వేడ్క నలుపుచు
నాలతు లాగిఁజేసి పాడి రభినవలీలన్.

కు. సం. ౪. ౧౬౮.

ఇంకను నీరీతిగ భావభరితములగు వర్ణన లెన్నియో కావించి యున్నాఁడు. ప్రసంగాంతరమున వాని నరసెదము గాక.